సంపుటము 2] నవంబరు 1915 [సంచిక 5

# బాలమిత్ర



## జయమిచ్చు మార్గము

వెంకట్రామయ్య అను చిన్నవాడు ఒకనాడు పాఠశాలనుండి ఇంటికి వెళ్లుచుండెను. వానిచంకలో రాతిపలక

యొకటి యుండెను. వానినెరిగిన యొక పెద్దమనిషి, మార్గ మందు వానినిజూచి దగ్గరకుపిలిచి అబ్బాయీ! గణితము నీ కెట్లువచ్చునని యడిగెను.

వెంక:—లెక్కలనిన నాకు తలనొప్పియని చెప్పెను.

పెద్ద:—నీవు నీ తరగతిలో లెక్కలు చేయుటలేదా?

వెంక:—నా లెక్కలన్నియు సుబ్బయ్య చేసిపెట్టుచున్నాడు. దానిచూచి వేయుచున్నాను.

పెద్ద:— అట్లాగా! నీవు భుజించు అన్నమును సుబ్బయ్యను భుజించుమనరాదా?

వెంక:—సుబ్బయ్య భుజించిన నేను బ్రతుకుటెట్లు? నేను మృతిబొందనా?

పెద్ద:— మరి నీ లెక్కలను సుబ్బయ్యను చేయుమనుటేల? నీవే చదువకపోయినయెడల నీ బుద్ధి ఎట్లు వర్ధిల్లును? నీ లెక్కలు సుబ్బయ్య చేయుచలయునని కోరినయెడల నీ భోజనమును వానికొసగి యూరకుండుము. సుబ్బయ్య నీ యన్నమును భుజించి నీ చదువును చదువుకొననిమ్ము.

వెంక:—అటుల న్యాయము. అట్లయిన నేనే లెక్కల నభ్యసించెదనయ్యా.

పెద్ద:-- అబ్బాయీ! వెంకట్రామయ్యా, ఆలాగే చేయుము. నీ లెక్కలను నీవే నేర్చుకొనుము. అదిమార్గము. కనుగొన్నావా?

వెంక:-- అయ్యా తమకు వందనములు. కనుగొన్నాను.

---

## అవిధేయత యొక్క ఫలము



ఇంగ్లాండు దేశమందు పదునాలుగేండ్ల పిల్లవాఁడొకఁడు చదువు కొన్నవాఁడై యుండినను అధికకృషి చేయ నిష్టపడక సోమరియై కూలిపనిచేయుచు వీధులవెంబడి తిరుగుచుండెను. ఒక నాఁడు ఒక దొరగారు తనచేతిలో కొన్ని రాళ్లతో నిండియుండిన

సంచినొకటి పట్టుకొని ఆ పిల్లవాని కగపడెను. అప్పు డతడు ఆ బాలుని పిలిచి “అబ్బాయీ! ఈ సంచి ఒక మైలు దూరమందున్న మెకెన్‌జీ దొరసానిగారింటికి తీసికొనివచ్చి నా కప్పగించినయెడల యీ సాయంకాలము నీకు ఒక షిల్లింగు (12 అణాలు) నిచ్చెదను. అందుకియ్యకొనెదవా” అని ఆదొరగారనగా, దినమునకు 4 పెన్నీలు (4 అణాలు) సంపాదించుటకే కష్టపడుచున్న ఈ బాలుడు 12 అణాలకూలి దొరుకుననగానే సంతోషించి ఆ దొరగా రిచ్చిన రాళ్లసంచిని తనభుజముపై నిడుకొనిపోవ సిద్ధపడెను. అయితే ఆ సంచిలో నేమియుండెనో మొదట ఈ పిల్లవానికి తెలియలేదు. అప్పుడు దొరగారతనిచూచి “అబ్బి, నీ వెంతమాత్రమును ఈ సంచిని తెరువకూడదు సుమీ” అని చెప్పిపోయెను. ఆ దినము ఎండవేడిమి అధికముగా నున్నందున ఆ బాలుడు సంచిని మోయుచు కొంతదూరముపోయి అలసట తీర్చుకొనుటకు ఒక రోడ్డు ప్రక్కను కూర్చుండెను. అతడు తనలో తా నిట్లనెను. “సంచి నెంతమాత్రము విప్పవద్ద”ని ఆ దొరగారు చెప్పిరి. అయినను విప్పి అందేమున్నదో ఒకసారి చూచినమాత్రాన ఏమికీడు కలుగును? చూతము అని సంచి విప్పిచూడగా అందు వట్టిరాళ్లుతప్ప మరేమియు కానకపోయెను. అతడిట్లనుకొనెను. “ఏమీ, ఆ దొర వెర్రివాడా? లేక నన్నవమాన

పర్సుటు కిట్లు చేసియుండెనా? మంచిది! నేనున్ను అతనివంటి తెలివిగలవాడనని అతడు గ్రహించునట్లు చేసెదను” అని ఆ సంచిలో నున్న రాళ్లన్నిటిని పారవేసి వట్టిసంచి భుజముపై నిడికొని సంతోషముతో నడచిపోవుచూ మెకెన్‌జీ దొరసానిగారిల్లు సమీపించి రోడ్డుప్రక్కనున్న రాళ్లతో సంచి నింపి, దొరసానిగారింటనుండు నౌకరికి యిచ్చివేసి కూలి నడుగగా, మరునాటియుదయమున కూలికొరకు రమ్మని చెప్పిరి. మరునాడు కూలికొరకు ఆ బాలుడు దొరగారివద్దకు వెళ్లి అడుగగా, దొరగారు ముఖము చిట్లించుకొని బైటకువచ్చి కోపముతో “నా సంచినివిప్పి రాళ్లను పారవేసి నా ఆజ్ఞను మీరి యిట్లు దగాచేయుటలో నీ అభిప్రాయమేమై యుండెను?” అని దొరగారా బాలుని నడిగి, నీవు నా ఆజ్ఞకు విధేయుడవై యుండిరాయుండినయెడల నీకు రెట్టింపు కూలి నిచ్చియుందును. గనుక నీకు కూలి “ఏమియు దొరకదు” పొమ్మని తరిమివేసెను. ప్రియ బాలబాలికలారా! పిల్లవాడు తన సంచివిప్పి రాళ్లను పారవేసెనని దొరగా రెట్లు తెలుసుకొనిరోయని మీ రడుగవచ్చును. ఆ దొరగారు రాళ్లను పరీక్షించే యుద్యోగియై యుండుటవలన తాను సంచిలోపోసిన రాళ్లకును పిల్లవాడు నింపినరాళ్లకునుగల భేదమును కనిపెట్టగలిగెను. ఏది ఎట్లున్నను, అవిధేయతవల్ల ఆ బాలునికి దొరి

కిన బహుమానమును చూచితిరా? అలాగ అనేక బాల బాలికలు విద్యనేర్చుకొనుట మాని సోమరులై తల్లిదండ్రుల యొక్కయు దేవుని యొక్కయు ఆజ్ఞలనుమీరి చెడిపోవు చున్నవారు పై సుదహరించిన బాలుని యొక్క బహుమానమును గుర్తించి జాగ్రతపడుట మేలు కాదా?

కందపద్యము॥ చెప్పినమాటను మీరిన
తప్పక మరిచేటుగల్గు తగినట్లు భువిన్
తప్పొప్పుకొనుచు వేడుడి
గొప్పగ మనదేవునాజ్ఞ గైకొని బ్రతుకన్.

---

# ధైర్యశాలియగు నొకబాలిక

బెల్జియందేశములో అన్నమ్మ అను నొక బాలికగలదు. ఆమె తండ్రి ఇప్పుడు జరుగుచున్న యుద్ధములో చని పోయెను. తల్లి ఎచటికో వెళ్లిపోయెను. ఇంట, అన్నయగు జానున్ను మిగుల ముసలిదగు అవ్వయుమాత్ర ముండిరి. జర్మనీవారు యుద్ధమునకై బెల్జియం చేరవచ్చుచున్నారని తెలుసుకొని అన్న వారినిచూడ పొలమునకు వెళ్లెను. ఇంతలో పాపము! ఆ విరోధులగు జర్మనులు జానును పట్టుకొనిరి. బెల్జియంవారు మంచి తుపాకుల తెప్పించిరనియు, ఇంకను

300 తుపాకులు కుగిలియుండవలెననియు జర్మనులకు, తెలియును గాన, ఈ చిన్నవాని “ఒరే! ఆ తుపాకుల చూపుమని” వాని ఇంటి దగ్గరకు తీసుకొని వచ్చుచుండిరి అన్నమ్మ, జర్మనులు తన అన్నను పట్టుకొనినది దూరమునుండియే చూచి జర్మనులు, ఇంట నున్న తుపాకులచూచి పట్టుకొనిపోయి చంపుదురని తెలిసి కొని యేమిచేయవలెనా అని ఆలోచించి, ఆలోచించి, ముసలి అవ్వ చెంత జేరి యామెను పరుపుపైనుండి దించి తుపాకుల నన్నిటిని బాగుగా మంచమునకువలె పేర్చి వానిపై బట్టపరచి, పరుపు వేసి మరల దుప్పటిపరచి ముసలిదాని పరుండబెట్టెను. ఈ ముసలమ్మను దినమునకు ఒక్కసారి పరుపునుండి లేవనెత్తి పరుపు సరిజేయువాడుక గాని నాటి కష్టమునుబట్టి రెండు సార్లు లేవనెత్తవలసివచ్చెను.

జర్మనులు జానును “అరే! తుపాకు లెక్కడ చెప్పు. లేదా చంపుదుమని” బెదరింపుచు, ఇల్లుదగ్గరకువచ్చి లోనికి పోయి సోదాచూడనారంభించి ఇల్లంతయుచూచిరి. చివరకు ముసలమ్మ పరుపుదగ్గరకువచ్చి దుప్పటి గట్టిగా నొకదు లాగగా కదలలేని ముసలిది “అయ్యో దైవమా” అని అరచి బిగ్గరగా ఏడ్వ వారు, పాపము! ముసలిది అని చెప్పి ఇక్కడ ఉండవచ్చినవా యని అనుకొనుచు ఇల్లువదలి దగ్గరనున్న బావిలో జానును పడద్రోసి సాగిపోయిరి. కొంతసేపటికి

"అన్నమ్మా!" అని పిలచు పిలుపు వినరాగా "ఏమిటా" అని అన్నమ్మ బావికడకు బోయిచూడ అన్న బావిలో కనబడి చెల్లితో త్వరగా బక్కెట్ లోనికి విడువుమని చెప్ప నామె అట్లేచేసి పొరుగింటి అమ్మను నొకతెను పిలిచి ఇద్దరు కలసి జానును బయటికి లాగివేసిరి.

ఆహా! ధైర్యశాలియగు నీ చిన్న బాలికయొక్క తెలివిని జూడుడి!

---

# మనస్సు, విద్య

ఆటలమీదనే మనస్సున్న కొందరు పిల్లలు అప్పుడప్పుడు పుస్తకములును, బళ్లును లేకుండినయెడల మేలుగా నుండునని కోరుచుందురు. చదువు రానియెడల మనకెట్టి సౌఖ్యములు నుండవను సంగతియు వారు బాగుగా నెరిగే యున్నారు. వీరే కొన్నిమారులు తమ తరగతులలోనున్న తెలివిలేని పిల్లలను జూచి "పాపము, వీనికి చదువురాదు. చిన్నప్పుడు క్రిందపడినందున మెదడు చెడిపోయినది. అందుకనే వానికి పది సంవత్సరముల ప్రాయమున్నను మొదటి తరగతిలోనే ఉన్నాడు" అని జాలిపడుచుందురు. అవును, పాపము, మనము మెదడని పిలుచు ఆ వస్తువులో నేదో ఒక

లోపమున్నందుననే వాడు పని చేయజాలకున్నాడు. వాడెంత కష్టించి చదివినను లాభములేదు. వానికి బహు కొద్దిగా తెలియును. ఈ సుందరమైన లోకములో మనము చూచి తెలిసికొనలేని వస్తువేదియు లేదు. అట్టి శక్తి మనకు దేవు డిచ్చినందున మన మాయనకు వందనములు చెల్లింతము.

---

# ప్రకృతి పాఠములు

## 16-వ పాఠము

### చెట్లబెరడు

చెట్లబోదెలో మూడుముఖ్యభాగము లున్నవి. అన్నిటి కంటె పైన ఉండు బెరడును, మధ్యనుండు బెండు భాగమును, వీని రెంటినడుమ నుండెడి చెక్కయునై యున్నవి. ఈ మూటిలో బెరడునుగూర్చి ఈ పాఠములో కొంత నేర్చుకొందము.

బెరడంతయు ఒక్కటేపదార్థముగాదు. అది రెంటితో చేయబడియున్నది. వానిని మనము పై బెరడు, లో బెరడు అని పిలువవచ్చును. పై దానిలో ప్రాణములేదు. వేప, చింత, దిరిశెనపు మొదలగుచెట్ల పై భాగమును పట్టిచూచిన

యెడల కఱకుగా మనచేతికి తగులునది పై బెరడై యున్నది. కొన్నిచెట్ల కీ పట్టను చెక్క-చెక్కలుగా దీసివేయవచ్చును. కొన్ని పై బెరడులతో చక్కని పనిముట్లను జేతురు.

ఈ పై బెరడు చెట్టుకు కోటువంటిదై యున్నది. లోపల నున్న జీవభాగముల కేమాత్రపు హానియు తగలకుండ కాపాడునట్టిది. మన శరీరమునకు వస్త్రములెట్లో చెట్ల కీ బెరడు నాలాగే యున్నది. అది బిగుతుగానుండు కోటుకానే కాదు. దానినిండ ఎక్కడపట్టితే అక్కడ లెక్కలేని పగుళ్లు గలవు. బిగుతుగానుండే రబ్బరు బనియన్లు వేసికొంటే మన కెట్లుండునో, అట్లే ఈ బెరడును బిగుతుగా నున్నయెడల చెట్ల కిబ్బందిగా నుండును.

మిక్కిలి చలిగానుండి హిమముపడు దేశములలోని చెట్ల కీ బెరడు మంచి రక్షకమై యున్నది. ఎండ లతివిశేషముగా నుండు ప్రాంతములలోని వానికిని ఇట్లే ఈ పై బెరడు ప్రాపకమై యున్నది.

పై బెరడును ఒలిచివేసినయెడల రసము విశేషముగా నున్న లోపలి బెరడును జూడగలవు. దీనియందు ప్రాణ మున్నది. నిండ రసమున్నది. చెట్టు ఎదుగుట కిది ఎంతో సహకారిగా నున్నది. దీనివలననే లోపలనున్న చెక్క చేయ బడుచున్నది.

చలిప్రాంతములలో నున్నవారు ఉష్ణప్రాంతములయందు మొక్కలను పెంచగోరి, తమ దేశములకు వాటి నప్పుడప్పుడు తీసికొని పోదురు. చలిప్రాంతములలో చెట్లకున్నంత విశేషముగా పై బెరడు ఉష్ణప్రాంతపు చెట్లకుండదు. గాన వాటికి చలిదెబ్బ తగలకుండుకొరకు, వాటి బోదెకు, కొమ్మలకు వరిగడ్డి చుట్టుదురు.

దేవుడు నేడుండి రేపు పొయిలోవేయబడు ఈ చెట్లకు అపాయములు రాకుండ తగినవాని ఏలాగిచ్చియున్నాడో చూడుడు.

---

# తేనెటీగల కథ



ఒక తోటలో ఒక చెట్టుమీద తేనెతుట్టె యొకటికలదు. దానిలో బజ్, హమ్ అని రెండు పిల్లఈగలు నివ

సించుచుండెను. దానిలో ఇంకను అనేక తేనెటీగ లున్నందున అదయంతయు చాల పనిగలిగిన ఇంటివలెనే యుండెను. దానియందున్న ప్రతి ఈగకును పనియుండెను. సోమరుల కచ్చట స్థలములేదు. గ్రుడ్లుపెట్టు రాణిఈగయు, దినమంతయు, అక్కడక్కడనున్న ప్రతిపువ్వుమీద కెగురుచు తేనెను తెచ్చు పనిఈగలును, పిల్లలకు కావలసిన భోజనము పెట్టుచుండు దాదిఈగలును ఆ తేనెతుట్టెలో పనిజేయుచుండెను. బజ్ హమ్‌లను చూచు దాదిఈగె వీటిని చాల దయగా చూచినందున ఇవి బలముపొంది కొద్దినాలములోనే తేనె తెచ్చుటకు కావలసిన బలముగలవి అయ్యెను.

గనుక ఒకనాడవి బయటకువచ్చి, తమ రెక్కలను గాలిలో ఆరబెట్టుకొని, ఎగిరి తమపని నారంభించుటకు బయలుదేరినవి. అవి అక్కడనుంచిలేచి, మిక్కిలి సొగసైన అనేక రకముల పువ్వులుగల ఒక తోటలోకి వచ్చెను. ఆ తోటచుట్టు నొక ఎత్తైన గోడగలదు. “మన మిక్కడ తిరిగి, ఈ చక్కని పువ్వులలో ఆడుకొందము” అని అవి ఒకదానితో నొకటి చెప్పుకొని, అక్కడ యిక్కడ తిరిగి, ఆ పువ్వు మీద ఈ పువ్వుమీద వ్రాలి, చాల సంతోషముగా తిరుగుచు తమ పొడుగాటి తుండములుచాపి, మకరందము త్రాగు

చుండెను. ఆ తోటలో అవి తిరుగునప్పుడు, తమకంటె సుఖ
ముగా జీవించు ప్రాణులు లోకములో లేవని తలంచెను.

కొంచెము సేపైనపిదప హామ్, "మన మీగోడదాటి బయ
టకువెళ్లి, లోక మేలాగున్నదో చూతము, రమ్మని బజ్‌తో
ననెను. "అవును. అక్కడ ఇంక చాల పుష్పాలును, తేనెయు
ఉండుననుకొంటాను. త్వరగా వెళ్లుదము రా" అని బజ్ చెప్పి
హామ్‌తో గలసి ఎగిరిపోయెను. అవి అచ్చట జేరగానే ఎంతో
సంతోషించెను. అంతకంటె చక్కనిస్థలము లేనేలేదని సంతో
షించెను. చాల ఎత్తైన చెట్లును, పచ్చికబయళ్లును, చాల
ఉన్నవి. ఈ రెండు ఈగలును గలసి ఒక చక్కని గన్నేరు
తోటకువచ్చినవి. అక్కడనున్న పుష్పాలన్నిటిని చూచి చాల
సంతోషించినవి. "ఎంత మంచివాసన! తప్పకుండా వీనిలో
తేనెగలదు" అని అవి రెండును ఎగురుచు ఒక పుష్పమీద
వ్రాలెను. అవి ఆ పుష్పతో "ఓ పువ్వా! నీలో ఏమైనా
తేనె యున్నదా?" అని అడిగెను. "అవును చాల ఉన్నది.
రండి, వచ్చి త్రాగండి. మీరు ఎగురగలరుగదా, మా దగ్గర
నుంచి, ఒక బహుమానమును తీసికొనిపోయి మా స్నేహితు
లగు ఇతర పుష్పాల కిత్తురా?" అని యడిగెను. "మీరు మాకు
తేనె నిచ్చినయెడల ఆలాగే మీకు సహాయము చేతుము. మేము
చేయవలసిన దేమిటి?" అని యడిగెను. "మాలోనున్న

బంగారుపొడిని కొంత మీరు తేనె త్రాగునప్పుడు మీ కాళ్ల తోను, రెక్కలతోను, ఇతర పుష్పాలలోకి తీసికొని వెళ్లండి" అని పుష్ప అనెను. తరువాత ఈ రెండు ఈగలును తమ తుండములనుచాపి ఆ పుష్పాలోనున్న మకరందమును త్రాగి, అవి కోరినట్లుగా బంగారుపొడిని ఇతర పుష్పాలలోకి తీసికొని వెళ్లెను.

చాలకాలమువరకు ఈలాగు ఒక పుష్పమునుండి మరియొక పుష్పాలోకి తిరుగుచు, చివరకు అలసిపోయి ఇంటికి పోదమని వెళ్లిపోయెను. పోయినప్పుడు తాము తెచ్చిన తేనెను, తుట్టె లోని పాత్రలలో పెట్టి నిద్రించుటకు లోనికి వెళ్లెను. చాల తేనెను తెచ్చినందునను, ఇతరులకు తాము చేయగలిగిన సహాయము చేసినందునను అవి చాల సంతోషము నిద్రించినవి.

ఇతరులకు సహాయము చేయువారే నిజముగా సౌఖ్యవంతులు.

---

# బైబిలు పిల్లలు

## యూదా

యూదాయును లేయాయొక్క పుత్రుడే. ఇతడు తన అన్నలవలె చెడ్డవాడుకాడు. అయినను ఇతనిలోకూడను కొన్ని బలహీనత స్వభావములు లేకపోలేదు.

యోసేపును అమ్ముటకు తక్కిన సహోదరులతో సమ్మతించినట్టు చూచుచున్నాము. ఎంత మంచివారైనను గుణ దోషములు ఉండకమానవు యూదాను అతనితండ్రి మొదటి ముగ్గురి కంటె ఎక్కువగా ప్రేమించినట్లు వేదగ్రంథమున చదువ వచ్చును. అందులకు కారణమేమై యుండవచ్చును? ఇతడు తండ్రిచిత్తమునకు యుక్తముగానడిచి తండ్రిని సంతోషపెట్టి నవాడగుటయేగాని వేరుగాదు. మనము మన తల్లిదండ్రు లను, మనకంటె పెద్దవారిని సంతోషపరచుచు వారికి ఇష్టము వచ్చినట్లు ప్రవర్తించుట మనయొక్క ప్రథమపని. మనము ఎప్పుడైతే ఇట్లు మంచినడత గలవారముగా ప్రవర్తించుదుమో అప్పుడే దైవము మనల మిగుల దీవించును. యూదాకువచ్చిన దీవన ఏది? ఈతని వంశమునందుగదా మెస్సీయా జనియిం చినది! ఇంతకంటె ఎక్కువైన దేదికావలెను? సర్వమాన వులను వారివారి పాపములనుండి విముక్తులజేయ తన ప్రాణ మర్పించిన జగద్రక్షకుండు ఈతని గోత్రమున జనియించుట ఈతనికెంత శ్లాఘ్యము! యాకోబుయొక్క ప్రథమపుత్రు డగు రూబేనునకే ఆ గొప్పవరము రావలసియున్నను అట్లు జరుగలేదు. చూచితిరా? దీనినిబట్టి మనము కొన్ని సమ యములందు మనకు రావలసియున్న గొప్పగొప్ప వరములను మనకుమనమే వద్దని త్రోసివేయుచున్నారము. ఇదంతయు

మనయొక్క అజ్ఞానమే. కాన మనము అట్లు అవివేకముగా ప్రవర్తించకయుండునట్లు శ్రీ భగవంతుని వేడుకొందము.

---

# బాలమిత్ర టపా

ప్రియ బాలమిత్రులారా!

బాలమిత్ర సంపాదకురాలుగారియొక్క దివ్య సముఖమునకు మీరు పంపించిన బాలమిత్రను మేమును మా హిందూస్నేహితులును చదివినాము. దానిలోని సంగతులు గ్రహించినాము. మేము మా బాల్యమునుండియే బాలమిత్రలో సంగతులు హిందువులకు బోధించుటకు శక్తిగలిగినది. మేము యిదివరలో మా యిండ్లకాడనున్నప్పుడు తిరుగుచు బూతుమాటలాడుచు గాలికి తిరుగుచున్న వారము. ఇప్పుడు తామస్ దొరవారు అమ్మగారు, మమ్ములను తీసుకొనివచ్చి మాకు యేసుక్రీస్తువాక్యము తెలిపినారు. మాకు జ్ఞానమును తెలివియు కలిగినది. ఇప్పుడు, హిందువులకు దేవునివాక్యము తెలుపుటకు మాకు శక్తికలిగినది. ఇంకా మాబడి అయ్యవార్లుకూడా మాకు దేవుని గూర్చిన సంగతులు యింకా చదువు మొదలయినవి నేర్పుచున్నారు. ఇంకా యింగ్లీషుకూడా బాగ నేర్పుచూయున్నారు. ఇట్లు మా దొరవారును మా అమ్మవారును, మమ్ములను రప్పించి యింత తెలివిలోనికి తెచ్చినారు గనుక వారికి వందనములు చెల్లించవలసినది. ఇంకా మాబడి అయ్యవార్లు మాకు విద్యలునేర్పి మాకు తెలివిలోనికి తెచ్చినందుకు వారికి వందనములు.

ఇట్లు
మీ ప్రియబాలమిత్రుడు
పిచ్చాని అంజయ్య
నరసరావుపేట

C. L. S. PRESS, MADRAS—1915